క. శునకముతగవుఁ వినియును
శునకం బదిచెప్పినటుల ♦ సురమందిరము
దున నుండఁ భిక్షుకు నటుఁ
బనిచినతీర్పరివి ధర్మ♦పాలన రామా. 38

క. మును తండ్రియాజ్ఞ చేకొని
ఘనమగునాయడవిఁ జేరి ♦ ఘనరాక్షసులఁ
దునిమియు నాతాపసులకు
మన మలరఁగఁ జేసినట్టి ♦ మా శ్రీరామా. 39

క. ఉదధిని గర్వం బణఁచియు
పదిలంబుగ సేతువు మరి ♦ బంధించియు నా
మదముగలరాక్షసుల నిల
పదమదమున జేసినట్టి ♦ జయశ్రీరామా. 40

క. భూతప్రేతపిశాచీ
పాతకపీడాజ్వరాది♦బాధలు మాకుఁ
భూతలమున రానీయక
ఖ్యాతంబగు పంజరమునఁ ♦ గావుము రామా. 41

క. మా వైరిసైన్యవర్గము
లావహ్నికి నాహుతులుగ ♦ నర్పించియు నో
దేవా దేవద్వేషుల
కావరము లడంచినట్టి ♦ ఘనుఁడవు రామా. 42

క. ఎక్కడిజననీజనకులు?
నెక్కడిపుత్రులు? కళత్ర? ♦ మెక్కడిచుట్టా?

లక్కడను పుణ్యపాపము
లొక్కఁ డనుభవించుభవము ♦ నొల్లను రామా. 43

క. రామా యనునక్షరములు
ప్రేమంబుగ బోయ తలఁచి ♦ విప్రుం డయ్యెన్
నేమమున నిన్నుఁ దలఁపక
కామాంధుఁడ నైతి నన్నుఁ ♦ గావుము రామా. 44

క. రామయను నక్షరంబులు
భీమం బగుపాపములను ♦ బిట్టణఁగించున్
రామా నీదుమహాత్త్వము
రామా పొగడఁగవశమె ♦ రామా రామా. 45

క. అతిప్రేమను నేలితి నీ
కతిబంధువ శబరి? యప్పు ♦ డటు దాస్యం బి
చ్చితివి మును దాసుఁడ గుహుఁడు?
బతిమాలినగాని నాకుఁ ♦ బలుకవె రామా. 46

క. చేసితిని ఘోరదురితముఁ
జేసితి నీదాసులకును ♦ జెరుపుల్ నేనున్
చేసినచెయ్యుల్ దలఁపక
భాసురముగ నేనయ్యు ♦ భక్తుఁడ రామా. 47

క. ఎక్కువపాపముఁ జేసితి
నిక్కడ; నటఁ జిత్రగుప్తుఁ ♦ డెంతో వ్రాసెన్
అక్కట నను యమభటులును
జిక్కులు పెట్టకమును ననుఁ ♦ జేరుము రామా. 48

శ్రీరామాయ నమః.

# రామశతకము.

బి. కంబయ్య విరచితము.



1929

నంద్యాల

వాణీ నికేతన ముద్రాక్షరశాలయందు ముద్రితము.



వెల 0—4—0

శ్రీరామాయ నమః.

# రామశతకము.

బి. కంబయ్య విరచితము.



1929

నంద్యాల.

వాణీ నికేతన ముద్రాక్షరశాలయందు ముద్రితము.

 వెల 0—4—0

# పీఠిక.

ఆర్య పండితపాఠక మహాశయులారా!

శ్రీభగవన్నామస్మరణశతకములు లోకమున ననేకము లున్నవి. ఉడుత కుడుతభక్తి యన్నట్లు నాభక్తికొలది నీగ్రంథమును రచించితిని. ఈ గ్రంథముయొక్క మహిమ పొగడ నావశమా.

దీనిని వ్రాయుచుండ శ్రీరామమూర్తి గరుడవాహనారూఢుడై ఒకానొకనాటిరాత్రి నాస్వప్నములో దర్శన మిచ్చెను, గాని మందమతినైన నేను వారితో నేమియు మందలించనైతిని. భక్తులకు భగవంతుడు దర్శనమిచ్చుటేమి వింత. 1924 సం. సిరువెళ్లతా॥ బత్తులూరుగ్రామం బోర్డుస్కూలు ఉపాధ్యాయుడుగానుండినప్పుడు తత్పురనివాసులగు నామిత్రులు కొందరు కొన్ని నాటకము లాడ దలంచి నన్ను కొన్నిపద్యములు పాటలల్లియియ్యమనగా, అదేప్రకారము రచించియిచ్చితిని తర్వాత నేను ఏదేని ఒకగ్రంథము వ్రాయవలయునని మొదట భగవన్నామస్మరణ సర్వపాపవినాశ మొసగునని మదినమ్మి యీశతకమును 1927 సం॥ చింతలచెరువుగ్రామం బోర్డుస్కూలు ఉపాధ్యాయుండగా ఉన్నప్పుడు రచించితిని. ఈగ్రంథమును బత్తులూరుగ్రామంలోఉండు పరమభక్త పరతంత్రుడు అచ్చువేయించుటకై కొంతధన మిచ్చెను. వారికిని, వారి పుత్రమిత్రకళత్రములకును, శ్రీరాములు సర్వదా శుభమిచ్చుగాత. అట్టిభక్తుడెవరన. క. శ్రేష్ఠమగు భక్తిచే మలి, శ్రేష్ఠి మహానందిశ్రేష్ఠి. చెలగుచు దేవ
జ్యేష్ఠుడనియీశతకము పరి, మేష్ఠిదయను నచ్చుకిచ్చె మేదినిరామా!

ఇట్టిమహనీయునితో కొంతధన మచ్చుకై సహాయమును బొంది నంద్యాల మునిసిపల్ హైస్కూలు ప్రధానాంధ్ర పండితులగు బ్రహ్మశ్రీ కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి దయను బడసి వారిని గురువుగా చేసికొని వారికీగ్రంథమును జూపితిని. వారు దీనిని బరిష్కరించి వెంటనే అచ్చువేయుంచుట కేర్పాటుచేసి నందులకు వారికి సర్వదా కృతజ్ఞతాభావా సేవకుడనై అభివందనము లాచరించుచున్నాను.

బత్తులూరు. 11-2-29

ఇట్లు విన్నవించు బుధజనవిధేయుడు,
బి. కంబయ్య.

ఉపాధ్యాయుడు ఎలిమెంటరీబోర్డు హిందూబాలురస్కూల్.

శ్రీరామాయ నమః.

శ్రీరస్తు. శుభమస్తు.

# రా మ శ త క ము.

క. శ్రీరామా శ్రితజనసుమ
దారా సీతతోడఁ గూడి ♦ నాగేంద్రముపై
వారాశిమధ్యమందునఁ
జేరి సుఖం బొందునట్టి ♦ శ్రీరఘురామా. 1

క. శ్రీరామా నను బ్రోవుము
ఘోరాటవికుంజరంబు ♦ కోరె మునీశ్వ
నీరాటము ద్రుంచియు కృపఁ
బోరాటము మాన్పినట్టి ♦ బుధనుత రామా. 2

క. పక్షికి మోక్షం బిచ్చియు
నక్షయముగ ద్రౌపదికిని ♦ నప్పుడు వలువల్
ఈక్షితి నిచ్చియుఁ గాచిన
రక్షోజనహరణ మానినీ♦రక్షక రామా. 3

క. తాటకిఁ గారిమార్చి యసుర
కోటుల నిలఁ గూల్చి యమరు♦కోటులఁ బ్రోవన్
జాటించియు మునిజన్నము
పాటుగ నెరవేర్చినట్టి ♦ బలియుఁడ రామా. 4

క. ఉల్లములోపల నిను నే
నెల్లప్పుడు దలఁచుచుండు ♦ నేమరకుండఁగ
దల్లివి దండ్రివి నీ వని
చల్లగ నను బ్రోవవయ్య ♦ సరగున రామా. 5

క. పెద్దల కెల్లను మ్రొక్కియుఁ
బెద్దగఁ గవిసత్తములను ♦ వినుతించియు నే
మద్దైవం బగునీపై
ముద్దుగ శతకము రచింతు ♦ ముదమున రామా. 6

క. నేరేడుపండ్లకు మణులను
ధారుణి వెల వోసినటుల ♦ ధరణిని నేనుఁగ
నేరక చిల్లరసురలను
కూరిమితోఁ గొల్చినాఁడఁ ♦ గ్రూరుఁడ రామా. 7

క. ఇప్పుడు నానుడులను గనుఁ
దప్పుల వెన్నియునో గలుగుఁ ♦ దమనామముతో
నొప్పు లయి మిగుల రుచి యగు
నుప్పగునే చెఱకు వంక ♦ నొందిన రామా. 8

క. భండనభీముఁడు భద్రుం
డండజయానుండు వరదుఁ ♦ డాద్యుఁడు హరి యా
ఖండలసుతుఁ డా శ్రీరా
ముండే దిక్కంటి నాకుఁ ♦ బ్రోవుము రామా. 9

క. దాసులఁ బ్రోచెడిబిరుదును
వాసిగఁ జేకొన్నయట్టి ♦ వరదుఁడ వౌనీ

దాసుఁడ స న్నేలుము మఱి
భాసురముగ ముక్తి నొసఁగి ♦ భవ్యుఁడ రామా. 10

క. శ్రీరామ రామ యనుచును
గారాబముతోడఁ దలఁపఁ ♦ గడుదుర్మతికిన్
ఘోరాఘానలజాలము
దూరానం బారఁద్రోలు♦దువు శ్రీరామా. 11

క. పెంపను జననివి నీవు ల
యింపను గలుషములు తండ్రి ♦ వీ వగుదు నివా
రింపను బహురోగములను
బెంపగు వైద్యుండ వీవె ♦ ప్రియమగురామా. 12

క. భండనభీముం డుజ్జ్వల
దండము గొని యార్తజనక♦దంబపు బాధల్
ఖండించెడుచాపకరుం
డండజశయుఁ డండ నాక ♦ టంటిని రామా. 13

క. వేదంబుల దొంగిలి బహు
మోదంబున సోమకుండు ♦ మునుఁగఁగ నబ్ధిన్
భేదించియు మత్స్యమవై
వేదంబుల బ్రహ్మ కిచ్చి♦వేసితి రామా. 14

క. సుర లసురు లబ్ధిలో మం
దరగిరి నిడి తఱచఁదఱుచఁ ♦ దద్గిరి బరువై
సొరుగన్ సురలున్ వేడఁగ
ధర కూర్మమవై భరంబు ♦ దాల్చినరామా. 15

క. భండనమునఁ జెండితి వు
ద్దండుఁడవై హేమనేత్రుఁ ♦ దుద్దండత భూ
మండల మబ్ధిం గలుపఁగ
దండించితిగద కిటివయి ♦ ధరలో రామా. 16

క. పొంకంబగు స్తంభమున ని
రంకుశముగ నుద్భవించి ♦ ప్రహ్లాదునియా
సంకట మెడఁబాపుటకయి
యంకమున హిరణ్యకశిపు ♦ నణఁచినరామా. 17

క. సురలను ద్రోలియు దైత్యులు
సురలోకము నాక్రమింప ♦ సురలును వేఁడన్
ధరఁ గొంటివి సురలకునై
నరగర్వం బణఁచి బలిని ♦ వడుగై రామా. 18

క. భండనమున క్షత్రియులను
ఖండించితి విరువదొక్క ♦ సారిన్ రౌద్రో
ద్దండతను బరశురామో
ద్దండుఁడవై భూభరంబు ♦ దాల్చినరామా. 19

క. సేతువు బంధించియు మరి
పాతకుఁడౌ పంక్తికంఠుఁ ♦ బరిమార్చియు వే
సీతను గొనియు నయోధ్యా
భూతలమున్ జేరి ప్రజలఁ ♦ బ్రోచినరామా. 20

క. ధరణిని నీదుమహత్త్వము
నరయఁగ నే నెంతవాఁడ ♦ హరబ్రహ్మాదుల్

అరయఁగ లే రో కేశవ
మురహర నీపాదములకు ♦ మ్రొక్కెద రామా. 21

క. పెద్దగ సురలున్ వేఁడఁగ
బౌద్ధుఁడవై త్రిపురస్త్రీల ♦ పరిణయమై యా
బుద్ధమతము నిల్పితివౌ
బౌద్ధుఁడవై నాకు నొసఁగు ♦ బుద్ధిని రామా. 22

క. కలిమి నొసఁగ భూపుత్రియు
కలుషంబులఁ బారద్రోలఁ ♦ గను నీనామం
బలలక్ష్మణుఁ డాప్తజనం
బుఁడవైదో డగుదు రిల్లు ♦ బుధనుత రామా. 23

క. నీతిన్ దప్పియుఁ దమ్ముని
పాతకుఁడై యింద్రసుతుఁడు ♦ బయటన్ ద్రోయన్
బ్రీతిగ సుగ్రీవుం గాని
ఖ్యాతిగ వాలిన్ వధించి ♦ నట్టిఁడ రామా. 24

క. పరకాంతల నాసించియు
పరధనముం దొంగిలించి ♦ పరునోగిరమున్
మురిపెంబునఁ గొనుట మహా
నరకం బని తెలియుబుద్ధి ♦ నా కిడు రామా. 25

క. రామా కడుదురితంబులఁ
గామంబునఁ జేసినాఁడఁ ♦ గష్టాత్ముఁడనై
ప్రేమము చెలువారఁగ నీ
ధామంబునఁ జేర్చుకొనుము ♦ దశరథరామా. 26

క. నిను నెప్పుడు నామదిలో
ననుదినమును దలఁచుచుందు ♦ నండజయానా
నను నేలు ముక్తి నొసఁగుచు
మును శబరిని నేలినట్లు ♦ మురహరి రామా. 27

క. మిము కన్నులు చూడఁగ హ
స్తములుఁ మ్రొక్క లిడఁగ ♦ శ్రవణములు వినఁ
దనుకథలను; నాసిక తమ
సుమవాసన నాసగొనఁగఁ♦జొనుపుము రామా. 28

క. దోసిలి యొగ్గితి రామా
దాసుఁడ నీదాసులకును ♦ దాసుఁడ నేనుఁ
జేసెద మీభజనము నను
భాసురముగ నేలవయ్య ♦ భాస్కరరామా. 29

క. హాలికునకు హలాగ్రంబున
కలిమి ధరఁ జిక్కినట్లు♦గను నీనామం
బెలిమిని నా మది నిలిపితి
నిల నాదుఃఖము లడంపు ♦ మీాశ్వర రామా. 30

క. మిన్నందినతాడుల మును
దిన్నగ సుగ్రీవుఁ దెలుఁగఁ ♦ దెలుపఁగఁ దమకుఁ
గ్రన్నన నేలం గూల్చితి
వెన్నఁగ నీ శౌర్యమహిమ ♦ నెఱుఁగను రామా. 31

క. మాధుర్యంబును మానియుఁ
జేఁదును భుజియించినటుల ♦ చిల్లర వేల్పుఁ

మేదిని దలఁతురు కొందరు
నీదుమహాత్త్వంబు దెలియ♦నేరరు రామా. 32

క. భీకరులగు యమభటులకు
ప్రాకటముగ భీతి నొసఁగుఁ ♦ బాపము లడఁచున్
వైకుంఠద్వారంబును
దీకొని నీనామ మట్టె ♦ త్రెంచును రామా 33

క. ఆదిత్యసోమవహ్నులు
నాధరణియు భూజములును ♦ నద్రులు నదులున్
మేదిని సర్వప్రాణుల
కాధారుఁడ వీవె నన్ను ♦ నరయుము రామా. 34

క. సురలును వేడఁగ పూర్వము
సురలకు నభయంబు నిచ్చి ♦ సురలకొఱకునై
నరిదైత్యులఁ జంపుట కీ
ధరఁ బదియవతారములను ♦ దాల్చినరామా. 35

క. పక్షితురగ యూక్షితిఁ గల
మక్షికలు పిపీలికాది♦మనుజుల నెల్లన్
రక్షించెడిన ట్టైవు సూ!
రక్షింపుము యాతునాంబ ♦ రఘుకులరామా. 36

క. రామ హరే శ్రీరామ హ
రే మాధవ కృష్ణ శ్రీహ♦రే యనుచు భువిన్
ఏమాత్రము దలఁచిన నీ
నామము వైకుంఠ మిచ్చు♦నఁట శ్రీరామా 37

క. శునకముతగవుఁ జెవినియును
శునకంబది చెప్పినటుల ♦ సురమందిరమం
దున నుండఁగ భిక్షుకు నటు
బనిచినతీర్పరివి ధర్మ♦పాలన రామా. 38

క. మును తండ్రియాజ్ఞ చేకొని
ఘనమగునాయడవిఁ జేరి ♦ ఘనరాక్షసులన్
దునిమియు నా తాపసులకు
మన మలరఁగఁ జేసినట్టి ♦ మా శ్రీరామా. 39

క. ఉదధిని గర్వం బణఁచియు
పదిలంబుగ సేతువు మరి ♦ బంధించియు నా
మదముఁగలరాక్షసుల నిల
సదమదమును జేసినట్టి ♦ జయశ్రీరామా. 40

క. భూతప్రేతపిశాచీ
పాతకపీడాజ్వరాది♦బాధలు మాకున్
భూతలమున రానీయక
ఖ్యాతంబగు పంజరమునఁ ♦ గావుము రామా. 41

క. మా వైరిసైన్యవర్గము
లావహ్నికి నాహుతులుగ ♦ నర్పించియు నో
దేవా దేవద్వేషుల
కావరము లడంచినట్టి ♦ ఘనుఁడవు రామా. 42

క. ఎక్కడిజననీజనకులు?
నెక్కడిపుత్రులు? కళత్ర? ♦ మెక్కడిచుట్టా?

లక్కడను పుణ్యపాపము
లొక్కఁ డనుభవించుభవము ♦ నొల్లను రామా. 43

క. రామా యనునక్షరములు
ప్రేమంబుగ బోయ తలఁచి ♦ విప్రుం డయ్యెన్
నేమమున నిన్నుఁ దలఁపక
కామాంధుఁడ నైతి నన్నుఁ ♦ గావుము రామా. 44

క. రామయను నక్షరంబులు
భీమం బగుపాపములను ♦ బిట్టణఁగించున్
రామా నీదుమహాత్త్వము
రామా పొగడఁగవశమె ♦ రామారామా. 45

క. అతిప్రేమను నేలితి నీ
కతిబంధువ శబరిఁ యప్పు ♦ డటు దాస్యం బి
చ్చితివి మును దాసుఁడ గుహుఁడుఁ
బతిమాలినగాని నాకుఁ ♦ బలుకవె రామా. 46

క. చేసితిని ఘోరదురితముఁ
జేసితి నీదాసులకును ♦ జెరుపుల్ నేనున్
చేసినచెయ్యుల్ దలఁపక
భాసురముగ నేలినయ్య ♦ భక్తుఁడ రామా. 47

క. ఎక్కువపాపముఁ జేసితి
నిక్కడ; నటఁ జిత్రగుప్తుఁ ♦ డెంతో వ్రాసెన్
అక్కట నను యమభటులును
జిక్కులు పెట్టకమును నను ♦ జేరుము రామా. 48

క. నిఖిలభువనరక్షక యీ
యఖిలంబును నీవె గావె ♦ యబ్ధిశయన నా
యఖిలదురితంబు లడఁచియు
సుఖగా ననుఁ బ్రోవవయ్య ♦ సుందరరామా. 49

క. గుప్పున మంత్రించి తృణం
బప్పుడు కాకాసురుపయి ♦ నంపిన వాఁడున్
రొప్పుచు దిరిగిజగంబుల
నప్పుడు మిమ్మే శరణన ♦ నాపినరామా. 50

క. అంభోధి తమునివాసము
కుంభిని సింహాసనంబు ♦ గొడు కాకసమున్
అంభోధితనయ నీప్రియ
కుంభిని నిట్టినినుఁ గొల్వ ♦ కొదవే రామా. 51

క. ధరణిన్ నీదుమహత్త్వం
బరయఁగ నే నెంతవాఁడ ♦ హరబ్రహ్మాదుల్
అరయఁగలేరో కేశవ
మురహర జగదీశ నీకు ♦ మ్రొక్కెద రామా. 52

క. ఏతీరుగ నేఁ దలఁచినఁ
బీతాంబర నన్నుఁ గావఁ ♦ బ్రియముగ లేదో
భూతలమందున శబరికి
నాతత మోక్షం బొసంగి♦తట శ్రీరామా. 53

క. శంఠయయిన దశకంఠుని
కంఠంబులఁ ద్రుంచి వేల్పు♦గంటుల కెల్లన్

గంభీరవమై దైత్యుల
కంఠంబులఁ జెందినట్టి ♦ ఘనుఁడవు రామా. 54

క. కష్టములఁ బడు వేళల
దుష్టులచేఁ జిక్కి బాధ ♦ దొరలెడి వేళన్
సృష్టిని నిన్నుఁ దలఁచిన వి
శిష్టముగను మమ్ము రక్షఁ ♦ జేతువె రామా. 55

క. రాముఁడు సుశ్లోకుఁడు జన
కాముఁడు నిత్యుఁడు దయాబ్ధి ♦ ఘనసోముండు
ద్దాముఁడు సుచరిత్రుఁడు శ్రీ
రాముండే దిక్కటంటి ♦ రయమున రామా. 56

క. శ్రీరాముఁడ నీనామము
పారాయణఁ జేయుచుందు ♦ పలువిధములుగా
ఘోరములగు పాపములను
దూరంబున నుండఁ బంపు♦దువె శ్రీరామా. 57

క. చక్కనిజవ్వనిమోవికి
చక్కెరకును జుంటితేనె ♦ జాలుకు మిగులన్
జొక్కుచు నీనామామృత
మెక్కువ రుచి యని యెరుంగ ♦ శ్రీధర రామా. 58

క. సోమకుని ద్రుంచితివి బల్
భూమిని నెత్తితివి శృంగ♦మున దరిగొండన్
సేమముగ దాల్చితివి శ్రీ
రామా నన్నేలనయ్య ♦ రఘుకులరామా. 59

క. నీటను రాళ్లను దేల్చియు
నీటుగ సేతువును గట్ట ♦ నీటగునుడు తా
పాటగునిసుకను దెచ్చిన
గోటను సంతసపరచిన ♦ గురునుత రామా. 60

క. జాతులు చర్చింపవుగద
నీతిగ నెవ్వరైనఁ దలఁప ♦ ని స్నీక్షితిలో
ఖ్యాతిగ మోక్షము నిచ్చెదు
ప్రీతిగ నా కియ్యవేమి ♦ ప్రియమగు రామా. 61

క. దుష్టుల నెల్లను గూల్చియు
శిష్టులఁ బరరక్షణంబుఁ ♦ జేసితి ప్రేమఁ
గష్టుఁడ నను నేలుమ యీ
సృష్టిని నిను నమ్మి కొల్తు ♦ నెంతయు రామా. 62

క. ధరణిఁ బుట్టిన దాదిగ
నరయక కొన్నింటి నేను ♦ నరసియు కొన్నిఁ
దురితంబులఁ జేసితి నా
దురితముల నడంచి ప్రోవు ♦ దొరయగు రామా. 63

క. పసులను పక్షిని పామును
వసురుని యజ్ఞము నహల్య ♦ నా మర్కటముఁ
వసుధఁ గాచితివే న
న్నసురారీ గావ కరుణ ♦ నరయవె రామా. 64

క. నీదుమహాత్వం బెట్టిదొ
రా దురితా లావలికిఁ బ♦ఱచిన సునామా

పాదుకొని నిల్చి తలుపై
మేదిని నిజమనుచు బుధులు ♦ మెచ్చగ రామా. 65

క. మీకథలనె జిహ్వ చదువ
మీకో వెలకే యడుగులు ♦ మేదిని వెడలన్
మీకార్యమునే చేయగ
జోకన్ దెలివొసగి కావు ♦ సుందరరామా. 66

క. హరిభక్తి నింద్రియంబుల
మరి గెల్చును సత్తముండు ♦ మధ్యము డందున్
మరవక తా యత్నించును
మరచును నధముండునిట్లు ♦ మనుకులరామా. 67

క. గొప్పను కొంచెం బెంచక
యెప్పుడు నీదాసులందు ♦ నెసగెదు రామా
యిప్పుడు నిను నే నమ్మితి
తప్పక కాపాడవయ్య ♦ దశరథ రామా. 68

క. భానుకులాబ్ధి సుధాంశుడ
భానుకుమారకుని గూడి ♦ పరిమార్చితివా
భానుని బట్టెడుయాస్వ
ర్భానునివలె వచ్చు కుంభ♦శ్రవణుని రామా. 69

క. కలుషహరణ కమలనయన
ఖలహరణా కంబుకంఠ ♦ కపిరక్షణ కుం
డలిశయన గరుడవాహన
యిలలో నను బ్రోవవయ్య ♦ యినకుల రామా. 70

క. ఒక్కఁడె చాలు సుపుత్రుఁడు
పెక్కురు దుర్మార్గు లేల ♦ ప్రియమగు రామా
నిక్కపు దేవుని ని న్వడి
తక్కంగల వారిఁ గొల్వ ♦ దగునే రామా. 71

క. ఎంతని వేడుదు నిను నా
చింతలు దీర్చియును బ్రోవఁ ♦ జేతఁ గాదా
కాంతయు రాయై వేఁడిన
నంతఃకరణమునఁ బ్రోచి ♦ తౌ శ్రీరామా. 72

క. దండిగ దుర్మార్గులు భూ
మండలమున నిండియుండ ♦ మనుజులమందుఁ
పండితనుత జన్మించియు
దండించితివి గద వారి ♦ ధరలో రామా. 73

క. నినుఁదలచిన గజమును నీ
వనుమానము లేక బ్రోచి ♦ తది చుట్టంబా
నిను నిత్యము మరువక నే
ఘనముగ వేడ సుఖ మిచ్చి ♦ గాచితె రామా. 74

క. సృష్టిని మును సుగ్రీవుని
కష్టము తోలగించి నీవు ♦ గాచితి వేనా
కష్టము తోలగించియును వి
శిష్టముగను మోక్షమిమ్ము ♦ శ్రీరఘు రామా. 75

క. శ్రీరామా సీతాధిప నఁ
గారాబముతోడ నేలు ♦ కంజదళాక్షా

నేర నినుఁ దలఁచుపద్ధతి
శూరా సుగుణాకర ఘన ♦ సుచరిత రామా. 76

క. నీవు తుఁడాయు విచ్చెడు
నీపుత్రిక పావనతయు ♦ నెమ్మి నొసంగన్
నీపత్ని సిరుల నిచ్చును
నేపున నినుఁగొల్వ కొాదవ ♦ యేమగు రామా. 77

క. పుత్రులు ఋణస్థులు భువి క
ళత్రము భవబంధ మగును ♦ లలి నన్య లనన్
పాత్రులను స్వకార్యమునకె
ధాత్రిని నిక్కాట భవము ♦ తలఁపన్ రామా. 78

క. సొంపుగ నీచారులతో
పెంపగు నీకథల వినఁగ ♦ పెరిగెను గరులున్
సంపాతికి నినుఁ దలఁచిన
సంపదసౌఖ్యంబు లిచ్చు ♦ సరగున రామా. 79

క. మెండుగ జను లేమైనను
దండిగ యాచింతు రనుచు ♦ దలఁచి యుదధిలో
పండితివి నీదుకపటము
ఖండితముగ దెలియువాడు ♦ గలడే రామా. 80

క. రాతిని నాతిగఁ జేయుట
సేతువుకై నీటఁ దేల్చు ♦ శిల లిది వింతా
నీతులఁ బ్రోచుట వింతయె
ఖ్యాతిగ నన్నేలవయ్య ♦ కరుణన్ రామా. 81

క. ఉదధిన్ దాఁటెను మారుతి
మద మెక్కినలంఖిణిఁ బరి ♦ మార్చె నసురులన్
ఘదమణచె లంకఁ గాల్చెను
గద నీభక్తుండ యాట♦కతనను రామా. 82

క. తాటకి నొకవిశిఖముచే
పాటుగ నావాలి నొక్క♦బాణముచేతన్
కాటకుఁ డగుమారీచుని
గీటడఁచితి వొక్కకోలఁ ♦ గీర్పడ రామా. 83

క. కుక్షిని నజాండకోటని
నక్షయముగ నిల్పి ప్రోచి ♦ తౌరా పొగడన్
జక్షుశ్శ్రుతిపతికైనను
దక్షత్వము గలదె యింత ♦ దశరథరామా. 84

క. తమనామ మెఱుఁగ హరుఁడన?
తమమర్మ మెరుగ గరుడిన? ♦ తమసూనృతవా
క్క్రమ మెరుగ విభీషణుఁడన?
తమలీల లెఱింగి పొగడ ♦ తరమే రామా. 85

క. దనువను గంధర్వుఁడు మును
ఘనమగు కలుషములఁ జేయ♦గను స్థూలశిరుం
డనుముని కబంధుఁడవు గ
మ్మున నాతనిశాప ముడిపి♦నట్టిఁడ రామా. 86

క. సీతాధిప సిరు లిచ్చియు
వాలికములఁ బొంద్రోలె ♦ బహుకష్టములన్

భూతలి బొరియఁగ నీయక
ఖ్యాతిగ నన్నేలవయ్య • కరుణను రామా. 87

క. యమభటులు వచ్చువేళ గ
దము లెచ్చినవేళఁ గఫము • దగ హెచ్చినవే
ళ మురహర మీపదస్మర
ణము దలఁతును లేదొ యిపుడె • సమ్మతి రామా. 88

క. హైమవతీశ్వరునకు నా
హేమకశిపు పుత్రునికి మఱిన్ తిరుమంత్రం
బై మఱి హస్తికహల్యకుఁ
బ్రేమగఁ సంతస మొసఁగిన • ప్రియమగు రామా. 89

క. ఎన్ని దోసంగులు నానుడి
నున్నను నిన్నెన్నుకతన • నన్ను దోసంగుల్
పన్నుగఁ దొలఁగును గాదె వి
యన్నది వంకరయిన చెఱు • గానే రామా. 90

క. పండితుని భావము నిలఁ
బండితుఁడే తెలియుఁ గాని • బడవల కెఱుకే?
మండూక మళివలె గొలన
నుండి యెఱుఁగునొకొ తేనె • యున్నతి రామా. 91

క. తాళవనంబునఁ బెద్దయుఁ
కాలంబున్నట్టిదుష్ట • గార్ధభదైత్యున్
గూలిచి గోపాలురకున్
వాలాయముగా ముదంబు • పరచిన రామా. 92

క. సంసారసాగరమునకు
కంసారీ తెప్పవయ్య ♦ కలుషము లెల్లన్
ధ్వంసము సేయుము శత్రుల
హింసింపుము సర్వకాల ♦ మేలుము రామా. 93

క. అప్పయనుజ్ఞం గైకొని
మెప్పుగ నాయడవిఁ జేరి ♦ మేదిని ఖలులై
తప్పుడునడతల నడచిన
యప్పాపుల రక్కసులను ♦ నణచిన రామా. 94

క. కోరి భజించెద నిన్నును
ధారుణి నాకష్టములను ♦ నస్పించియు నీ
ఘోరంబగు సంసారపు
వారధిఁ జేరంగనీకు ♦ వరదుఁడ రామా 95

క. రామా కపిలుడవై మును
ప్రేమాతిశయంబుచేతఁ ♦ బొసఁగ సమీరా
పాముఖ్యధరామునకును
నిమిషములో జూపినట్టి ♦ యునకుల రామా. 96

క. మధుకరఝంకారము విని
మధుపంబుగ మారుచుండు ♦ మహిఁ గీటక మా
మధురకథల వినినను మీ
పథముల్ బొందుటలు చిత్ర♦భంగియె? రామా. 97

క. ప్రీతిగ నీశతకము విన
పాతకములు దొలఁగిపోవు ♦ బహుసౌఖ్యములున్

భూతలమున గలుగు టరుదె
ప్రీతిని పఠియించ తొలఁగు ♦ పీడలు రామా. 98

క. పటుమద్దూఃపల్లి వేం
కటసుబ్రహ్మణ్యశాస్త్రి ♦ గారిని గురుఁ గ
బటువగు జ్ఞానముకై మి
క్కుటమగు భక్తిఁ బ్రణమింతు ♦ గొప్పగ రామా. 99

క. శ్రీకంబయకొమరుఁడ వా
ల్మీకికులోద్భవుఁడ మండ్ల ♦ శ్రీగోత్రుజుఁడన్
ప్రాకటకంబయ నాముఁడ
మీకంకితముగ రచించి ♦ మొసఁగితి రామా. 100



శ్రీవాణీ నికేతన ముద్రాక్షరశాల, నంద్యాల.

శిరువెళ్ల తాలూకా బత్తులూరి గ్రామం ఆంజనేయ స్వామి దేవాలయములో అనుదినమును భజనసేయు భగవద్భక్తి పరాయణులు ఈ రామశతక ముద్రణకై కొంత ధన సహాయమును జేసియున్నారు గాన వారికిని వారి పుత్ర పౌత్ర మిత్ర భ్రాతు జననీజనకులకు సర్వదా శ్రీరామచంద్రుండు శుభమిచ్చుగాత.

వలయువారు,

పి. కంబయ్య,

టీచర్,

బత్తులూరు,

ఎర్రగుంట్ల పోష్టు, శిరివెళ్ల తాలూకా.

అని వ్రాయవలెను.